బులు పరుసన నాటనేసియు. ఉది 6 28.

వ. ... కపిల యనుదానిం నమృతం బును [illegible] బ్రాహ్మణు లను ఘృతాచీ మేనకాపలయిన యప్సరసలను బుట్టిరి. ఆది. 3.65

సీ. ... గోవృషముక్క గుట్టెడువాఁడు డన్మ్మషక్క ఘాతియగు [illegible] నధో గతి కరుగువారు. అను. 2.62.

స్త్రీ.

1. ఆవు.

వ. ఒక భార్గవునకు [illegible] నొక్క మహాప్రభావుండు సత్యంబునను సౌజన్యంబునను గోసత్కార యొనం గిన నమ్ముని తన గోవు నయ్యోషధి మేపి పోషించిన నది సుపుష్టయు సుస్వరయు సురూపయునై యొక్క వృషభంబు పొందుపడసి గర్భిణియై మిథునంబు నీనిన అను 3.63.

2. భూమి.

సీ. [illegible] మహి యది సుహాలోనఁ [illegible] జెంది యెత్తుటను గోవిందుఁ డనియు. శాంతి. 6.432

పుం. స్త్రీ.

[illegible]

కం. గోవులు సూర్యుని యుజ్వల, గోవుల యప్లనుఁడేని గోదానపరుల్, భూవిపులా సూర్యసన్నిభులై వెలుఁ గుదురిట్లు చెప్పు నాగమ [illegible]. ఆను. 2.461.

**గోవృషము** సం. వి అ. పుం.

1. శ్రేష్ఠమైన ఎద్దు. [illegible] ఇక్కడ 'గో' శబ్దము వృషభ వాచకము. వృషశబ్దము శ్రేష్ఠవాచకము. ఇది కృపుని ధ్వజచిహ్నము.

సీ. కనక గోవృష సాంద్ర కాంతి పరిస్ఫుట,ధ్వజ సముల్లాసంబువాఁడు కృపుఁడు. విరా. 5.4; ద్రోణ. 3.233

2. ఒకానొక దేశము ఈ దేశాధిపతి ధర్మజుని రాజసూయమునకు వచ్చెను. సభా. 1.283.

# గౌ

**గౌణము** సం. విణ. (అ. ఈ. అ.)

గుణ సం[illegible]

**గౌతమ గోత్రము** సం. విణ.

గౌతమఋషి సంప్రదాయము.తిక్కన గారి గోత్రము జనకమహారాజ గోత్రమును ఈ గోత్రమునకు ఋషులు. (1) ఆంగీరసుఁడు, (2) అయాస్యుఁడు. (3) గౌతముఁడు.

సీ. మజ్జనకుండు సమ్మాన్య గౌతమ గోత్ర మహితుండు భాస్కరమంత్రి [illegible] విరా. 1.10.

**గౌతమి** సం వి. ఈ. స్త్రీ.

1. గౌతమవంశమునఁ బుట్టినది. ద్రోణుని భార్య, కృపాచార్యుని చెల్లెలు – కృపి, అశ్వత్థామ తల్లి.

2. ఒక బ్రాహ్మణ స్త్రీ (చూ. గౌతమీ లుబ్ధక సర్ప మృత్యు సంవాదము) ఆర. 1.5. మొ. 42 వఱకు.

**గౌతమీ లుబ్ధక సర్ప మృత్యు సంవాదము** సం. వి. అ పుం.

ఒక ఇతిహాసము. యుద్ధానంతరము పశ్చాత్తాపపడు ధర్మజునకు భీష్ముఁడీ

**గ్రంథము** సం. వి. అ. పుం.
కావ్యాది - పొత్తము.
ఆ గ్రంథం బధిగమించి దాని నభ్య
సించుటకు మర్త్యుల కాయుర్బుద్ధులు
సాలవు. శాంతి. 2.203; శాంతి.
6.29.

**గ్రంథము ధరియించు** సం. అ. క్రి.
గ్రంథమును వల్లెవేయు.
నీ గ్రంథంబు ధరియించుఁగాని నీ
కర్థబోధంబు లే దర్థబోధ వ్యపేత,
మగు గ్రంథధారణ మప్రయోజనము.
శాంతి. 6.29.

**గ్రంథి** సం. వి. ఇ. పుం
1. ముడి.
ఉ. ... భక్తిహృద్గ్రంథివిభేదనా.
విరా. 1.333.
కం. క్షమయును దమమును సత్యము,
నమేయ మహిమాస్పదంబున
విదుము ధర్మములందెల్లను నఖి,
వర్ణ్యములవి హృద్గ్రంథి భేదన
ప్రౌఢంబుల్. శాంతి. 5.544.
(ఈ తావుల రాగాదిచే నైన బంధము
అని భావము.)
2. వ్యథ.
ఉ. అంధక వృష్ణి భోజ కుకురాన్వయ
భూపతులెల్ల నిదెనన్ బాంధవ
సౌహృద ప్రణయ భక్తి విశేషము
లొప్ప నీ మనోగ్రంథి యడంగఁ
జేయ నెసంగుచునుఁ జూచినవారు లోభ
మోహాంధులు ధార్తరాష్ట్రుడు జనా
ధిప మార్కొనువారె వారలన్. ఆర.
4.160.

**గ్రక్కదలు** దే. అ. క్రి.
(గ్రక్కు + అదలు - ఉభయ యతుల
లోనిది.)
కంపించు, అదరు.
తే. వెడలి క్రమ్ములుఁ డగువారు వివిధ
భృత్యగణముఁ దానును నేల గ్రక్క
దలఁ గదలి,రాజరాజు గాంగేయుఁ
బురస్కరించు కొని సముద్ధతి నడచె
దిక్కులు వడంక. ఉద్యో. 4.163.
చం. గదఁ గొని భీముఁ డంత్య
లయకాల కృతాంతుఁడ పోలె నేల
గ్రక్కదలం నడిచి నిల్చిన సకంపి
తుఁడై మతిమంతుఁడు. ఆర. 4.18.

**గ్రక్కు** దే. వి. కయక్కు.
నోటను మొదలగు వానియందలి అను
భవము.
ఆ. చన్న వెడఁదవాతి యమ్ముచమ్ము
చముగ నొక్క ముష్టిఁ దొడిగి గ్రక్కు
నంగ, నవడు లీలఁ దునుమ నడచు
లబయుడు విరా. 5. 49.

**గ్రక్కున** దే. క్రి. విశ. క్రియ.
శీఘ్రముగా.
కం అనిన విని పూని గ్రక్కున,
జనుదేవమి నడుడు దస్సెఁ జాలఁడని
నెమ్మనమున నెటింగి యూరి,యను
జన్మునిఁ బనిచె పంపు సంపుడయి
నన. విరా. 1..52.
మ. ధరణీపక్రము నడచినఁగ
సముద్ధాంతంబునై గ్రక్కున,గుటు
సైన్యంబులు వచ్చి ముట్టికొనమె
గోవర్గమున్ దినమై,మంటం బెద్ద
బకుడు గడంగుము ... విరా 4 5
(వడ వడిగా వచ్చి ముట్టికొనమె -
అని అర్థము )

స్కందాపస్మారము (చూ. బాలగ్రహములు) ఆర. 5.252.

4. పదాఱేండ్ల పిదప మనుజులను వేధించు గ్రహములు.

1) దేవగ్రహము :- నిద్రించు సమయమునఁగాని మేల్కొని యున్న సమయమునఁగాని మానవుని బట్టి భ్రమసిన పలుకులు పలికించునది. 2) పితృగ్రహము :- పరుండి యున్నప్పుడు గాని కూర్చుండి యున్నప్పుడుగాని పితరులను జూచి యున్మదించునటుల జేయునది. 3) గంధర్వగ్రహము :- భ్రాంతినొంది గంధర్వులను జూచునట్లు చేయునది.

4) యక్షగ్రహము:- అప్పుడప్పుడు ప్రవేశించి భ్రమియింపఁ జేయునది. 5) వికృత గ్రహము ;- వాతపిత్తాదులచే బుద్ధి చెడి యేర్పడునది. ఆర. 5.253.

5. మొసలి.

మ. ... మహాగ్రాహి గ్రహోత్యుగ్ర ప్రయత్నమై పేర్చు పయోధి దాటితి జనాశ్చర్యైక సంపాదినై. ... ఆర. 7.25.

6. అధ్యాత్మయాత్మునైన విష్ణుని నామములలో నొకటి. శాంతి. 3.110.

**గ్రహించు** సం. స. క్రి.

1. పట్టుకొను, స్వాధీనము చేసికొను.

వ. ..అతనిపయి నెత్తివోయి తదీయ గోధనంబుల గ్రహించిన ధర్మతన యుండును దమ్ములు నష్టపడం బఱతెంతురు. విరా. 3.117.

2. చేతితోఁ బట్టుకొను (పాణిగ్రహణముచేయు).

తే. చిత్తమున గాఢరాగంబు చేతఁ జూపు తెఱఁగు దోఁపఁ గెంపారెడు తీఁగబోఁడి, మృదులపాణిఁ గుమారుండు మెలపుమై గ్రహించెఁ బల్లవాలంబి మత్తేభలీల

వ. ఇట్లు పాణిగ్రహణం బాచరించి. విరా. 5.399,400.

3. తెలిసికొను, అభ్యసించు.

కం. శ్రౌత స్మార్త నిమిత్త, జ్యోతిర్విద్యలు గ్రహించి యోగ్యసమయ సం, జాత ప్రాగల్భ్యుఁడనై, చాతుర్యము మెఱసి మానసంబలరింతున్. విరా. 1.70. (పాఠాం.) (వహించి పాఠము)

4. సహించు.

చం. ప్రతిబల దర్పభంజనుఁడు పార్థుఁడు దారుణ బాణవర్షము, న్నతి నతివీరుఁడై కురిసినం బరముండు మహాంబువృష్టిఁ బర్వతము గ్రహించి నట్లు బలవంతుఁడు దాని గ్రహించి పోర నక్షత తనుఁడయ్యె వాని నతి గర్వితుఁ బార్థుఁడు సూచి యాత్మలోన్. ఆర. 1.311; చూ. ఆర. 1.312.

**గ్రహోపఘాతము** సం. వి. అ. పుం.

(గ్రహ + ఉపఘాతము).

గ్రహముల వలని బాధ.

కం. విను డెబ్బదియేండ్లగు దాఁక తను మానవులకు గ్రహోపఘాతంబులు గల్గు ననంతరంబ గ్రహముల, పని వలవదు ముదిమి యెల్ల పనులకుఁ జాలున్. ఆర. 5.254. శ్లో. యావత్ సప్తతి వర్షాణి భవంత్యేతే గ్రహాస్తృణాన్, అతఃపరం దేహినాం తు

గ్రహపుర్యో భవేజ్జ్వరః. సం. భార ఆర. 230.58. (మూలములో జ్వరః అని యుండగా ఎఱ్ఱన 'ముదిమి' అని మార్చుటంబట్టి ఎఱ్ఱన భారతము వ్రాయునాటికి బెట్టిదిహాటి ముదిమికాభ పద మందెనేమో.)

## గ్రా

**గ్రామణి** సం. విశ. (ఇ. పుం ఇ).
ముఖ్యుడు
ఉ. భీముడు పగ్గ దర్పమున నీపు నిమైం జన సిద్ధమై కురు, గ్రామణి భల్లపంచక యుగంబున నాటెను మేను నించుడున్. భీష్మ. 2.309, ఎఱ్ఱ. 1.146.

**గ్రామణీయుడు** సం విశ.(అ.ఆ అ).
గ్రామవాసి.
వ. ... పుష్కరారణ్య నివాసులైన యాభీర గణంబులను సరస్వతీ సింధు మూలాశ్రితులైన గ్రామణీయులను ... పంచనదాదిపర్వతి నివాసులను వశంగతులం జేసెని. సభా 1.266.

**గ్రామము** సం. వి. అ. పుం.
1. ఊరు.
సీ. ఉపస్య నుఁదయాస్తమయ కాలముల నిద్రం బొందుటయును . గ్రామంబు సెఱుచుటయును పాపంబులందురు బుధజనములు. శాంతి. 1.293; ఆది. 3 221.
2. (శబ్దాదిపూర్వకమైనపుడు) సమూహము.
ఇంద్రియ గ్రామము శాంతి. 4. 364, భూత గ్రామము. శాంతి. 4 90; పుణ్య గ్రామము స్త్రీ. 2.1.
3 ప్రదేశము, స్థలము.
మాలిని - ... గ్రామ పద్మావలీ సం,గమ సుభగ పదాబ్జా. విరా. 1.335.

**గ్రామ్యము** సం విశ. (అ ఆ అ).
గ్రామసంబంధము.
1. ఊరియందు బుట్టినది.
వ ... పశువులయందు గ్రామ్య పశువుల ... 3 221.
2. అసభ్యము, అశ్లీలము.
మ. ... యున్మత్త ... వస్తు ... ముక్తకేశుడు బహుగ్రామ్యోక్తి ... మునీశ్వరుండు ... దుర్వాసుడన్ ... యష్ముద్గలు పాలికిన్. అర. 6.116.

**గ్రామ్యోక్తి** సం. వి ఇ. స్త్రీ.
అసభ్యపు మాట.
(చూ. గ్రామ్యము రెండవ అర్థము)

**గ్రావము** సం. వి. న్ పుం.
కొండ, ఱాయి.
ఉ ... భూరి భూరుహ, గ్రావ నఖాయుధుల్ ... వాలి సుగ్రీవులు దాటి రొంటొరుం ఆర. 6.380.

**గ్రావస్తుతుడు** సం. వి. అ. పుం.
ఒక మహర్షి. ధర్మజుని రాజసూయమున సుబ్రహ్మణ్యుడుగా నున్న వాడు. సభా. 1.292.

**గ్రాసము** సం. వి అ పుం.
తిండి, ఆహారము.
వ. ... నపు ... తుర ...

2. తూర్చి పైకి లేవనెత్తు.

వ. ... ఇభంబులు వాదివి నేలతో డ్రేసియుఁ గాలం జమరియుఁ దూల చైచియుఁ గొమ్ముల గ్రుచ్చి యెత్తియు బారి సమరిన విఘటాకారంబులగు ఘోటకంబులనై. భీష్మ 1.267.

**గ్రుచ్చు** దే. స. క్రి

నాటించు

శా. ... స్ఫురద్వజ్రంబులు నారాచంబులు పెక్కులొక్కుమొగి మేనన్ గ్రుచ్చ మూర్ఛిల్లె కర్ణ 1.165

2. గాఢముగాఁ బట్టుకొను, బిగియఁ బట్టుకొను

సీ. ధర్మపుత్రుఁ డుప పసిప్పాయిపమున కతిభక్తి నెఱఁగిన కౌఁగిట నిష్ఠత్రి గ్రుచ్చి నిమిఁగేలఁ బెద్దయుఁ దడవుగాఁ గౌఁగిలింపఁగ. ఉద్యో. 3.353.

కం. మఱియును సాత్యకియు వినయ, భరితాంతఃకరణులగుచుఁ బ్రణతులయిన నయ్యిరువురను గ్రుచ్చి పెనయఁ,బరిరంభణ మాచరించెఁ బరమప్రీతిన్. శల్య. 2.140.

ఆ. వేగపడుట మేల వినుము కార్యము దీఱఁ,బిఱుకుఁడు దాని లెఱఁగు దగిన యప్పుడాడరాదె యిపుడు ముకుఁ ద్రాడుఁగాలు గ్రుచ్చనేల కమలనాభ. ఉద్యో 3.220.

ఆ. ... భూమి యచలమునకుఁ,బోవ నెఱిఁగి కళ్యపుఁడు నిజోరువు నెఱి, గ్రుచ్చి, దాపుగాఁగ నిల్పి యెత్తె. శాంతి. 5.89, భీష్మ. 1 263.

4. (మాలిక మొ.) కూర్చు.

కం వెరవున నూఁతల నెత్తెలఁ గరముల మత్స్యములఁ బట్టి కడు సంతసముం, బొరయుచుఁ ద్రాళ్ళం గ్రువ్వఁగఁ, గని నూపించి ప్రాప్తకాలజ్ఞుండున్. శాంతి. 3.193.

సీ. .. హారముల్ మెఱయ నాయ్యాసరంబుగా గ్రుచ్చి యుపాంశు వింపగా నలవరించు. విరా. 1.107; భీష్మ. 3 108.

5. ఎత్తిచెప్పు, ఉదాహరించు

కం పనులయెడ మేలుగాంచిన పసగడ యగ్గలము రా,జనయజ్ఞ ధృతక్షోటి, గొనియాడుము సేయు పేరు గ్రుచ్చి కొలుపుదనన్. ఆ. 1.64

వ. నీ వలసినట్లొకనొకని పరిపింపుమని వారలం బేరుగ్రుచ్చి యుపదేశించిన. శాంతి 2.366.

6. నాటించు.

వ. ... పది బాణంబులు పద్మనాభునురంబునం గ్రుచ్చి. ద్రోణ. 3 196.

వ. అతండు ..నిశాత సాయకసప్తకంబు శరీరంబున గ్రుచ్చినం గోపించి యుపేక్షింపక భీష్మ. 3.39.

ఆ. మొనసి క్రీడి...చండ మార్గణములు గ్రుచ్చె,నూట నిరుపురజు కర్ణ. 3.298.

**గ్రుడ్డు** దే. వి. (క. గుడ్డు.)

నేత్రగోళము కనుగ్రుడ్డు, తారక, నల్లగ్రుడ్డు.

కం. ఈ పగ దీర్చెదనంచుఁ గోపంబున రాజుకొడుకు గ్రుడ్డులు రెండుం, లోపడునట్లుగ గోళ్ళన్,వేపెఱికి రయమున గగనపీఠిక నెగసెన్. శాంతి. 3.249.

వ. .... అతి నిశిత దంష్ట్రా కరాళం బైన తన వదన గహ్వరంబుఁ దెఱచి గ్రుడ్లు మెఱవ .. గర్జిల్లుచున్న వాని... అర. 1.107.

సీ. కుఱుచ చేతులు మిడిగ్రుడ్లును గడుగొన్న తఱటులు మఱి చెంచుఁ డలలు నమర.....అర. 1.300.

2. పక్ష్యాదుల యండము.

తే.... అంత నుదయమయ్యె నవ్వేయి గ్రుడ్డుల నధిక బలముఁ దేజమును గల్గి యా సర్పరాజి... అను. 1.167.

**గ్రువ్వ** దే. వి. గువ్వ.

అడవి పావురము.

గీ. గ్రువ్వ గద్ద దివ్వారుపుఁ బువ్వు గూట,యిల్లు సొచ్చిన శాంతి సేయింప వలయు. అను. 4.119.

ఆ. ఫలము నినుము వెండిఁ బసిఁడి ముచ్చిలికొన్నఁ, గ్రోఁతి వాయసంబు గ్రువ్వ నీచ,కృమియు నగు. అను. 4.266.

## గ్రొ

**గ్రొచ్చు** దే. స. క్రి. (√ గ్రొయ్యు. వ్రాఁతయందిది పరుషాదిగాను గానఁ బడుచున్నది. అని. శ. ర.)

గుద్దలి లోనగువానితో పల్లము చేయు, గుంట త్రవ్వు.

చం. ... బం డనిన సపుత్ర మిత్ర ముగ నద్దెస నందఱ గ్రొచ్చి పాఁతు దున్. ఉద్యో. 3.142.

వ. అంత నా క్షతియులొక్క భార్గ వుని యిల్లు గ్రొచ్చి యనంతంబయిన యర్థంబుం గని. ఆది. 7.133.

ఉ. .. నూయి గ్రొచ్చి నీ,ర్వావిరి గన్నయట్టులు శివంబగు తత్త్వము గాంచు నెమ్మెయిన్. అను. 3.316.

శ్లో॥ యథా ఖనత్ఖనిత్రేణ జాంగలే వారి విందతి,అనిర్వేదాత్తథా స్థాన మీప్సితం ప్రతిపద్యతే॥ సం. భార. అను. 152.3. (నిర్ణయ).

**గ్రొప్పించు** దే. స. క్రి.

త్రవ్వించు.

వ. అప్పుడప్పుట్ట గ్రొప్పించిన నలిగి నిమీలత నయనుండై చ్యవనుఁడు సంయాతి సైన్యంబులకెల్ల మూత్ర పురీష నిరోధంబుఁ జేసిన. ... అర. 3.178.

**గ్రొయ్యు** దే. అ. క్రి.

గీ. అమ్మహాత్ముఁడు .... ఇచ్చు, గోగణంబుల గొరిజల గ్రొస్సి యయ్యెఁ గాదె యీ సరోవరము జగన్నుత ముగ. అర. 4.368.

## గ్రో

**గ్రోఁకు** దే. స. క్రి.

గోఁకు, బరుకు.

తే. ... శిరము గ్రోఁకంగఁ దగదిరు సేఁత. అను. 4.102.

('గోఁకు'-అని సూ. అ.ని. పాఠము).

శ్లో॥ న సంహతాభ్యాం పాణిభ్యాం కండూయేదాత్మనః శిరః. సం. భార. అను. 161.73. (నిర్ణయ).

## గ్లా

**గ్లాని** సం. వి. ఇ. స్త్రీ.

(శ్రమము, మనస్తాపము, క్షుత్పిపాసలు

మొదలగు వానిచేఁ గలిగిన)
దౌర్బల్యము.

వ. ... (ధృతరాష్ట్రుఁడు) విదుర కృప సంజయుల నుద్దేశించి తనకు ముఖశోషయుం దను గ్లానియుం గలిమి నుగ్గడించి. ఆశ్ర. 1.39.

## ఘం

**ఘంట** సం. వి. ఆ. స్త్రీ.
గంట.

మ. ... ఘంటా నినాదాత్త ఘోషణ నానా పటు బృంహితధ్వనియు. విరా. 3. 159.

**ఘంటాకర్ణుఁడు** సం. వి. అ. పుం.

వ. .... తన యనుచరుఁడైన యిత నిని శివుఁడు కుమారస్వామికి అను చరుఁడుగా నిచ్చెను. 2.183.

**ఘంటిక** సం. వి. ఆ. స్త్రీ.

1. చిఱుగంట.

చం. ... కరీంద్ర ఘంటికా,భ్యుదిత నినాదము. విరా. 5.39.

ఉ. ...ఘంటికా స్వనోపేతముగాఁగ వాఁడెలమిఁ బెద్ద యెలుంగునఁ జాటె నెల్లెడన్. మౌస. 1.24.

**ఘట** సం. వి. ఆ. స్త్రీ.
ఏనుఁగుల సమూహము, సమూహము.

సీ. ... ఉభయ పార్శ్వంబుల నిభ ఘటలేలకో చనుదేవు సమదాళి సమితి మొరయ. విరా. 1.186.

**ఘటకుఁడు** సం. విశ. (అ. టీకా. ఆ).
ఘటిల్లఁ జేయువాఁడు,

కం. ... సమంచితానల సంస్కార దశా పూతత్వము నా, విదితయశుఁ డౌనర్చె విప్రవితతి ఘటకుఁడై. మౌస. 1.152.

**ఘటజానకుఁడు** సం. వి. అ. పుం.
ఒక మహర్షి. ధర్మరాజు సభకొకపరి వచ్చినవారిలో నొకఁడు. సభా.1.21.

**ఘటన** సం. వి. ఆ. స్త్రీ.
ఘటనము, చేయుట.

చం. ... నితాంత దంత రటదాస్య రంగ వికట భ్రుకుటీ చటుల ప్రవృత్త న,ర్తన ఘటనా ప్రకార భయద స్ఫురణా పరిణద్ధ మూర్తియై. విరా. 2.133; విరా. 3.77.

2. కృత్యము, యోగము, కూర్పు.

తే. ... గడవరాని, దైవఘటనకు నొత్తుఁ జిత్తంబులోన. విరా. 2.208.

**ఘటనము** సం. వి. అ. న. ఘటన.
కూర్పు, యోగము, కృత్యము.

కం...అ,ప్పలుకులకు నసత్యత్వము, గలుగఁగ నేర్చునొకొ దైవఘటన బలమునన్. శల్య. 1.263

**ఘటపృష్ఠము** సం. వి. అ. న.
బాన యడుగు భాగము, బొచ్చె.

తే. స్థావరములుఁ దన్నుఁ గలయ, విలయ మొందిన ఘటపృష్ఠ విధము దాల్చి. శాంతి. 5.74.

**ఘటము** సం. వి. అ. పుం.

1. కుండ, కడవ.

సీ. ... తనదు శుక్లము నిర్గమించిన ఘట సురక్షితము సేయ సప్తభేదము లొంది యది సత్పురుషులైరి. శల్య. 2.160.

కం. వినుము ఘటము సేయుట సాధ నములు లేకున్న నగునె. శాంతి. 5.368.

2. ఖాన.
చూ. ఘటపృష్ఠము

**ఘటశుద్ధి** సం. వి. ఇ. స్త్రీ.
భాండములను శుద్ధిచేయుట.
సీ. ... ఇలువడి ఘటశుద్ధి గలిగిన కాంతలందు. తే. నిలు. ఆను 1.285.

**ఘటి(యి)ంచు** సం. స. క్రి
1. చేయు, కావించు.
కం. జనకుఁడు వేడుకఁ జేసొచ్చిన యంతన సంతసిల్లి చేతం బిండం, బనుమానింపక యేఁ, బెట్టిన శాస్త్ర విధానగతి ఘటింపమి వచ్చున్. ఆను 3.129.
వ. ఆకాంత ... అంజలి ఘటించి యవ్విరించి కిట్లనియె. ద్రోణ. 2.167
2. సమకూర్చు, నెఱవేర్చు.
తే. కుసుమబాణుని బాణముల్ గూడ నైదు, గరఁగి నేరిమి వాటించి కరువు గట్టి, పోసి చేసి చైటెన్ని సంపుటము దగ ఘటించిరో కాక యిట్టి చేడియలు గలరె. విరా. 2.27.
3. ఆయత్తపఱచు, సిద్ధముచేయు
చం.... ఘటింపఁగఁ బంపు రథంబు చయ్యనన్. విరా. 3.150.
4. మోపు, ఆరోపించు.
ఉ. ... అన్నపైఁ, తప్పు ఘటించి నీవు నొక తాలిమి గల్గినవాఁడవై నెపం బొప్పినఁ జెల్లె నీదు నిలుపోపును జూతముగాక యిచ్చుటన్. విరా 5.93.
5. ఏర్పఱచు, కూర్చు.
చం. ... అట్టిదియును ధర్మువే తగ ఘటించిన నిక్కము లేదయేని. ఉద్యో. 2.70.
వ. .... లలాటంబుల నంజలి పుటంబులు ఘటించి. ద్రోణ. 2.363; విరా. 1.13.
6. జరిపించు.
సీ. ... కపటంపు జూదంబు ఘటియించి ధర్మాత్ముఁడగు ధర్మసుతు సిరి యపహరించి. కర్ణ. 3.356.
7. కల్పించు.
సీ. .... అచ్చోటి మాటలవి కొన్ని ఘటియించి చెప్పి. మౌస. 176,
8. నిర్మించు, పన్ను.
ఉ. ... వైరిదృష్టులకు భీకరమై చనుఁ గ్రౌంచరూపవంబెల్లి ఘటింపు నీదు వెరవేర్పడ నమ్మెన యద్భుతంబుగన్. భీష్మ 2.20.
9. పొందు, సిద్ధింపఁజేయు.
సీ. ... అర్థముల్ దుర్బుద్ధికైనను సిద్ధించు నగుకాలమున నార్యులయ్యుఁ గాని ఆ — కాలమున ఘటింపఁగాఁ నేరరు. శాంతి 1.185.
కం. వెండియు ధనార్థనములు, గొండలవలనను ఘటించుకొనననుం. భీష్మ. 1.37.
10. చెప్పు.
తే. వ్యాస మునినాథు షట్పుణ్యైశ్వర్య ధుర్యు నాగమ వ్యాస కర్మరు నమిత తేజుఁ, గొలిచి తత్ప్రసాదంబున వలను దెంపుఁ గలిగి యేను నారాయణుకథ ఘటింతు. శాంతి. 6.346
11. సంపాదించు.

చం. .... భోగపరుండు గావునన్, ధనము ఘటింపఁగాఁ దగు విధంబని చూచి. శాంతి. 3.472.

అ. క్రి.

సంభవించు, జరుగు.

కం. మొదల విధినియతియును న,ట్టిద యందురు పెద్దలది ఘటింపనిపోదే, మదిఁ జూచి చెప్పినను, ద,ప్పుదు మేరువు దిరిగేనేని బాంచాలసుతా. ఉద్యో. 3 123.

**ఘటిక** సం. వి. అ. స్త్రీ

గడియ, అఱువది విగడియల కాలము ఇది ఇరువదినాలుగు నిమిషముల కాలము, $2\frac{1}{2}$ గడియలు ఒక గంటలేక 60 నిమిషములు.

సీ. ... అమ్మని నెడనాడి,యంతర్థి తుండయ్యె నపర ఘటిక. అను. 2 308.

**ఘటితము** సం. విశ. (అ. ఆ. అ).

యోజితము, కూర్పఁబడినది.

వ... భీమసేనుండు ఘటిత కాంచన బిందు సందోహ సుందరంబును దృఢ విశాలంబును నగు పంకయుం .. బుచ్చుకొని. భీష్మ. 2 64.

వ. ... విప్పరిద్భాసింబుఁ గివాపి ఘటితంబగు చౌరనొల్లక పవాఘటి తంబు విప్పలబుగా వగచి చొరం బోయి తత్కవాటస్ఫటిక శిలా ఘట్టిత లలాటుండనైన నన్నుం జూచి ... ద్రౌపది న... సభా. 2.140

**ఘటిల్లు** సం. అ క్రి.

పటుగు

సీ. ... భూతంబుల యందెల్ల దయ ఘటిల్లు. శాంతి. 5.228; శాంతి. 6.145.

**ఘటోత్కచుఁడు** సం. వి. అ. పుం.

భీమునకు హిడింబయందుఁ బుట్టిన వాఁడు. ఆది. 6.232.

(చూ.చివరి సంపుటము అనుబంధము)

**ఘటోదరుఁడు** సం. వి. అ. పుం.

వరుణుని సేవించు దానవులలో ఒక్కఁడు. సభా. 1.72.

**ఘట్టన** సం. వి. అ. స్త్రీ.

1. సంఘర్షణ, ఒరిపిడి, రాపు.

చం. కరితురగాది ఘట్టనయు గాలియు నొంపదె యొంటియున్న య,త్తరువు ఉద్యో. 2 88.

2 హతి, వ్రేటు.

తే. బాణఘట్టనఁ గన్గటఁ బడి పెదంబు. ద్రోణ. 4.117.

**ఘట్టనము** సం. వి. అ. న. ఘట్టన.

1 సంఘర్షణము, ఒరయుట, రాపిడి.

మ, గుణరావంబుఁ గ్రుపాణ ఘట్టన రవ ఘోషంబునున్. విరా. 3.160.

2 తాఁకుడు, త్రొక్కుడు.

వ. .... తురంగ రింఛా రథనేమి గజ పద ఘట్టనంబుల నిల గ్రక్కదలం ద్రోణ. 5 342.

3. హతి, వ్రేటు.

వ. ... కౌంతేయ సైన్య సంతానంబు నానాస్త్ర ఘట్టనంబుల విఘటితంబు సేయుచున్న నవ్వాయునందను నంద నుండు. ద్రోణ 5.225.

**ఘట్టము** సం. వి అ పుం.

సన్నివేశము.

ఆ. ఎట్టి ఘట్టములను నెట్టి యాపద
లను,నెట్టి తీఱములను ముట్టఁబడిన,
వంతలెల్లఁ బాయ నింతలఁ బ్రజలను,
నానరఁ జూడఁగనిన జనుల కెందు.
ఆది. 4.84.

**ఘట్టితము** సం. విణ. (అ. ఆ. అ).
కొట్టఁబడినది.
వ. ... లలాట ఘట్టిత గృహద్వారం
డయి. సభా. 2.86.
మ. .... గాంధారేశు వీతధ్వజున్,
విరథున్ విస్ఫురితాస్త్ర ఘట్టితునిఁ
గావింపన్. ద్రోణ. 1.160.

**ఘనత** సం. వి. ఆ. స్త్రీ.
గొప్పతనము.
ఆ. ఒలసి లోభ మోహములు దోష
సంసేవ,నం బౌనర్పఁగా ఘనత్వగాథ
యగు నవిద్య భూమియై బహు కర్మ
బీజముల కంకురాది శక్తులొసఁగు.
శాంతి. 4.344.

**ఘనపథము** సం. వి. అ. పుం.
మేఘమార్గము, ఆకాశము.
కం... ఘనపథ మఖిలంబుఁ దూఁటు
కట్టెడు తూర్య స్వనములును. భీష్మ.
1.236.
చం. ... సింహనాదము,ల్ఘన పథమెల్ల
నిండఁగ. మౌస. 52.

**ఘనము** సం. విణ. (అ. ఆ. అ).
1. దృఢమైనది, గట్టిది
వ. .. నిద్రితుండైన భీమసేను నతి
ఘన లతా పాశ బద్ధుఁ జేసి గంగ
మడువునం ద్రోచిన. ఆది. 3.13.
సీ...పొదవును ఘనమును నగు కోట
గలిగి శాంతి. 2.383.

2. గొప్పది.
మ. .. చతుస్సాగర మధ్యంబునన్
ఘన బాహాబలమొప్ప నన్ను నెదు
రంగా నొక్కఁడున్ లేమి యె,వ్వనికిం
దెల్లముగాదె. విరా. 2.75.
3. అధికమైనది.
మ. ... త్రిదశేంద్ర సూనుఁడు ...
ఘన శాతోజ్జ్వల దుర్నివార విలసత్
కాండంబులన్ ద్రోణు వాహన సూత
ధ్వజ దేహముల్ వొదివె. విరా.
5.137.
వి. అ. పుం.
1. మేఘము, మబ్బు.
చం. .... ఘనపంక్తులు లేని వియత్త
లంబు. శాంతి. 6.119.
ఉ. .. ఘన ప్రకారంబును బోలెఁ
గాఱుకొంచు. విరా. 5.69.

**ఘనసమయము** సం. వి. అ. పుం.
మేఘముల కాలము, వర్షఋతువు.
వ. ఆ వనచరుండు రామునకుఁ
గృతాంజలియై దేవా యీ ఘర్మసమయ
శేషంబును ఘనసమయంబునుం గడపి
మఱి సీతాన్వేషణంబునకు నుత్సహిం
చుట లెస్స. అర. 6.387.

**ఘనసారము** సం. వి. అ. పుం.
1. కర్పూరపు చెట్టు.
చం. సరళ తమాల .... ఘనసార
మహీరుహ రాజ రాజి సుం,దర నవ
నందనావళుల. ఆది. 8.78.
2. కర్పూరము.
చం. నల దమయంతులిద్దఱు .... సలి
పిరి దీర్ఘ వాసర నిశల్ ఘనసార
పాంసులం,దలిరుల శయ్యలన్. అర.
2.24.

3. శ్రేష్ఠమైన మేఘము (విశేషణోత్తరపదము).

ఉ. భూరి తపోవిశేష పరిపూర మృదుస్థిర హృత్కరండ వి,స్తార నివాస తంత్ర ఘన సార విధా పరమాభిరామ రే,ఖా రమణీయ ఘనసారము =(విష్ణుపరమున) శ్రేష్ఠమైన మేఘము; (శివపరమున) కర్పూరము.

**ఘనాంతావసరము** సం. వి. అ. పుం. (ఘన + అంత + అవసరము).

మేఘములు చివరి కాలము; శరత్కాలము.

కం.... జేవీసహితంబుగఁ బృథ్వీవరుఁ డవ్వనమునందు విహరించె ఘనాం, తావసర వాసరంబుల. ఆర. 4.327.

**ఘనాఘనము** సం. వి. అ. పుం.

వర్షాకాలము, వానకారు.

వర్షుక మేఘము, కురియు మేఘము.

కం. చని ఖాండవంబుఁ గాల్పఁగ, మొనసి మహాహస్తి యూథముల్ బోని ఘనా, ఘనములచే బాధితుఁ డయి,వనజాకవ కరిగి హవ్యవాహనుఁడనియెన్. ఆది. 8.249.

**ఘనుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

గొప్పవాఁడు, అధికుఁడు.

సీ. .. కర్ణార్జునులయందు ఘనుఁ డెవ్వఁడగునొక్కొ,యను ఊనంబుల సందియంబు మాన్ప. విరా. 4 205.

అ. ... అనుపమానతేజు ఘనుఁ గుమారుఁ గని. 7.350.

తరువోజ ... కౌరవజ్యేష్ఠుండు ఘనుఁ డిట్టులనియె. ఆది. 6.129.

(ఇక్కడ దృఢమైనవాఁడు, గట్టివాఁడు, తన పట్టుపలయే నెగ్గవలయు ననువాఁడు-అని భావము).

**ఘర్మజలము** సం. వి అ న.

చెమటనీరు, చెమట (చూ. ఘర్మము).

**ఘర్మము** సం. వి. అ. పుం.

చెమట.

ఉ. ఉల్లము చల్లడిల్లఁ దనువుద్గత ఘర్మజలంబు దాల్చుచున్. విరా. 2.91; శాంతి. 5.439.

2. వేసవికాలము.

వ. అట్టి ఘర్మదివసంబులు సహింపనోపకయున్నుం డొక్కనాఁడు కృష్ణునట్లనియె ఆది. 8 230.

**ఘర్మసమయము** సం. వి. అ పుం.

వేసవికాలము (చూ. ఘన సమయము, ఉదా.)

**ఘస్మరుఁడు** సం. విణ. (అ. ఆ. అ).

చంపినవాఁడు.

చం. కనుఁగొని పట్టుపడు మురఘస్మర యుల్లసదంఘ్రి ద్రోణ 1.356.

## ఘా

**ఘాతకుఁడు** సం. విణ. (అ. ఆ. అ)

చంపువాఁడు, హింసించువాఁడు.

సీ. ... పొలియుదు రన్యోన్య ఘాతకులై భవత్ జ్ఞాతిజనులు. స్త్రీ.2.161.

**ఘాతము** సం. వి. అ. పుం.

1. దెబ్బ, వ్రేటు, ప్రహారము.

వ. ... బకావరజుండు దస్సినంబవమానపౌత్రుండు పదవైచి తాను మీఁదై జాను కూర్పర ముష్టి ఘాతంబులు నిర్ఘాత పాతంబులు బోలెఁ బ్రయోగించి నొప్పించి. ద్రోణ. 3.268.

2 చంపుట, సంహారము.
వ... భృగు వంశజుండైన రురుఁడు గావించు సర్పఘాతంబు సహస్ర పాదుఁ డుడిగించినట్లు. ఆది.1.128.
సీ. పూతనాఘాతంబుఁ జేటనేతరమైన శకటభంజ స్తోత్రపును. సభా. 2 41.

**ఘాతి** } సం. విణ. (న్. నీ. న్.)
**ఘాతిని** }
చంపినవాఁడు, చంపినది. (వృత్తి యించు కర్మవాచకము పూర్వపద ముగా నున్నపుడే ఈ రూపమగును).
ఉ. .. సోదర ఘాతినైన ఇష్టంద మనంబునం బెఱుగ శోకము నెట్లు సహింతు...శాంతి. 1 14.
కం. బంధుఘాతిఁ బర ధనహరణ పరునిఁ జంపి పుణ్యుఁడగు నృపుఁ డనఘా. శాంతి. 1.95; అను. 5.105.
కం. పడయంగరాని కొడుకులఁ, గడుఁ బలువురఁ బడసి పుత్రఘాతిని వైతి. ఆది. 4.152.
2. నాశనము చేయునది, హరించునది.
తే. అధిప సర్వాస్త్ర ఘాతియై యతఁ డిల్లు,నస్త్రమునఁ జిత్రముగఁ దెగ యండఁ దునిమె. ద్రోణ. 3.205.
3. కొట్టువాఁడు, నలియఁగొట్టువాఁడు.
తే. ...గోవు, ముక్కు గుద్దెడువాఁడు చన్ముష్కఘాతి, యగు నతండు నధోగతి కరుగువాఁడు. అను. 2 62.
వి ఇ. పుం.
దెబ్బ, పోటు.
చం. ఉఱఁడు సురేంద్రుదైన బలి యుండు హిడింబుఁడు వాని శాకినీ వెఱవనివారలుం గలరె. ఆది. 6.195.

**ఘాతుకుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)
ఘాతకుఁడు.
చంపువాఁడు, హింసించువాఁడు.
సీ. ... పౌలియుదు రన్యోన్య ఘాతుకులై భవద్జ్ఞాతిజనులు. స్త్రీ. 2.160. (సం. ము. పాఠము )

**ఘాసము** సం. వి. అ. పుం.
లేఁత పచ్చిక.
ఉ. ... వెల్వడియె శైల విశాల గుహాలిను-డ నాగంబుల యూథ ముల్ సరస ఘాస పరిగ్రహణోత్సుకంబులై. ఆది 6 175.

# ఘూ

**ఘూకము** సం. వి. అ. పుం.
'ఘూ' అని ధ్వని చేయునది, గుడ్లగూబ.
తే. ... కనియె .. కాక ఘూకారవ స్ఫూర్తి . శమీ తరుచక్రవర్తి. విరా. 1.162.

**ఘూత్కారము** సం. వి అ పుం.
'ఘూ' అను ధ్వని, ధ్వని.
కం ...ధార్తరాష్ట్ర వీరుల శయ్యాగారముల నెగసె నెంతయు, ఘోరంబుగఁ గాక ఘూక ఘూత్కారంబుల్. సభా. 2.253.

**ఘూర్జరము** సం వి. అ. పుం.
ఒకానొక దేశము. గుజరాతిదేశము భీష్మ. 1.40

**ఘూర్జరుఁడు** సం. వి. అ. పుం.
ఘూర్జరదేశ పురుషుఁడు, గుజరాతి వాఁడు.

వ. . . ఘూర్జరులు బ్రద్దపరుల నడి దంబులం ... యుండుపురు శాంతి. 3.11.

**ఘూర్ణనము** సం వి. అ. న.
భ్రమణము, తిరుగుడు.
మ. అవనీచక్రము ... అర్ణవముల్ ఘూర్ణ ... సూతునకు ... విరా. 2.284.
కం. ... ఘూర్ణనమొందిన ... బనఁగ. అశ్వ. 4.163.

**ఘూర్ణమానము** సం. విణ. (అ.ఆ.అ)
తిరుగుచున్నది, కల్లోలపడుచున్నది.
వ. ... ధర్మజుం దమ్మెయికి సమ్మ తించి బీభత్సు వీక్షించి ఘూర్ణమాన మానసుండగుచు. విరా. 1.84.
తే. మందరాచల చటుల విమర్దనమున ఘూర్ణమానమై గాథ సంక్షోభ మెసఁగఁ దలఁకు జలనిధి నాఁ ద్రిగర్త క్షితీప, బలము దిరుగుచు వడిమె సంకులము గాఁగ. విరా. 3.177

**ఘూర్ణము** సం విణ. (అ. ఆ. అ).
భ్రాంతము, తిరుగునది. కలఁగునది.
తే. .. ద్రోణుండు గుణరవ స్ఫురణ ఘూర్ణరోదసీ ... గుచు మార్కొనఁ గడంగి. భీష్మ. 3.347.

**ఘూర్ణిక** సం. వి. ఆ. స్త్రీ.
దేవయాని పరిచారిక.
వ. ... దేవయానియు .. తన్ను రోయుచు వచ్చుదాని ఘూర్ణిక యను పరిచారికం గని. ఆది. 3.145.

**ఘూర్ణితము** సం. విణ (అ. ఆ. అ).
భ్రాంతము, తిరుగుచువడినది
ఉ. ... తలఁకి వాఁడు మహోన్నత ఘూర్ణితాకృతిన్ ద్రోణ 5.229.
తే అరుణములు ఘూర్ణిత ... లోచనంబులు మెఱయ. మౌస. 17
వ. .. ... కోప ఘూర్ణిత బాష్పపూరిత నయనయై యున్న దేవయానిం గని ... ఆది. 3.145.

**ఘూర్ణిల్లు** సం. అ. క్రి.
తిరుగుచువడు, సంక్షోభించు
మ... ... పట్టనము పాతాళంబు ఘూర్ణిల్లె విరా 4 172.
వ. .. దాపటి కల్లు ... ఘూర్ణిల్లె కర్ణ. 3 342.
వ. ... పురంబు సముత్సాహ ... క్రోధయంబునకు మహార్ణవంబై ఘూర్ణిల్లుచుండె. ఉద్యో 4 136

ఘృ

**ఘృణ** సం. వి. ఆ. స్త్రీ.
కనికరము, దయ.
కం. అవ్వసుధాధిపుఁడల్లని నవ్వొల యఁగ మాటుకొనె ఘృణాకలితుండై శల్య. 1.248.

**ఘృణి** సం. వి. ఇ. పుం. స్త్రీ.
కిరణము, వెలుఁగు.
తే. అతఁడు భూరి ప్రతాప మహా ప్రదీప, దూర విఘటిత గర్వాంధకార వైరి,వీర కోటీర మణి ఘృణి వేష్టి తాంఘ్రితలుఁడు కేవల మర్త్యుఁడే ధర్మసుతుఁడు. విరా 2.191.

**ఘృతము** సం వి. అ. పుం. న.

ఆజ్యము, నెయ్యి.

కం. ... అది ఓషధ్రశ్రీకి ఘృతంబు నకు వెన్నక్రియ జనకంబై. శాంతి 4.333.

**ఘృతాచి** సం. వి. ఈ. స్త్రీ.

ఒక అప్సరస్త్రీ కపిలా కశ్యపులకుఁ బుట్టినది ఆది 3.65.

వ్యాసుఁడు ఒకప్పుడు అగ్నికార్య పరుఁడై అరణి పుచ్చుకొని మథింపఁ దొడఁగెను. ఆ సమయమున నచట ఘృతాచి యను నప్సరోవనిత లోచన గోచరంబగుటచేఁ గామ గోచరత్వము నొందెను. అతనిని వంచింపఁ దలఁచి ఘృతాచి చిలుకయై యుండెను. అప్సరో రూపాతిశయ సక్త చిత్తుండైన వ్యాసునకు శుక్రస్రావమై యరణి యందుఁ బడియెను. అతఁడు నిర్వి శంకంబగు నంతఃకరణమున నరణి మథించెను. ఆ యరణియందు శుకుఁడు జనించెను. శాంతి. 6.250-251.

శ్లో॥ ఊర్వశీ మేనకా రంభా ఘృతాచీ చ తిలోత్తమా, సుకేశీ మంజుఘోషాద్యాః కథ్యంతేఽప్సరో బుధైః.

**ఘృతార్చి** సం. వి. స్. పుం.

విష్ణువు.

కం. ఘృత మర్చిస్సంపద యయి, ఘృతార్చిరభిధాన మొందె. శాంతి. 6.435

## ఘో

**ఘోటకము** సం. వి. అ. పుం.

అశ్వము, గుఱ్ఱము

వ. .. ఆస్థానంబు సేరవచ్చి ఘోటకంబుల నుపలక్షించుచున్న నన్నరేంద్రుండు గనుగొని. విరా. 1.257.

**ఘోటము** సం. వి. అ. పుం.

ఘోటకము, గుఱ్ఱము.

శా. ... ఘోట స్యందన వారణ ప్రతతులం గూడన్ సతూర్యంబుగన్. విరా. 5.242.

ఘోణ సం. వి. ఆ. స్త్రీ.

నాసిక, ముక్కు.

కం. ప్రాణాయామము గ్రమమునఁ బ్రాణోత్పీడనముగాని భంగి నడుపుచున్, ఘోణాగ్రస్థితి విషయశ్రేణి దొఱఁగియుండి యోగసిద్ధుఁ డగు యున్. శాంతి. 6.113.

**ఘోరము** సం. విణ. (అ. ఆ. అ.)

భయంకరము

సీ. ... ఘోర గృధ్రము సుకుమార నాగాంగనఁ, బటుగతి నొడియంగ బాఱుకరణి. విరా. 2.128.

వి. అ. న.

దారుణము, భయానకము, దురాగతము.

కం. తగుఁ బగదీర్చుట యిమ్మెఁ, దగవగునే నెత్తురెత్తి త్రావుట భీముండు గడున్ ఘోరము సేసెనుఁ మగల కతిక్షుద్ర వృత్తమా పొగడొనఁగున్. స్త్రీ. 2. 63.

ఘోషము సం. వి. అ. న.

1. ధ్వని.

సీ. ... రథ ఘోషమునఁ బ్రతిరవమిచ్చు నద్రుల భయమున వాపోవు

భంగినుండ. విరా 3.157; భీష్మ.
1.104
2 చాటుట, ప్రకటించుట.
వ. మన నగరంబునకు జంఘాలురం
బంప్రుము పురంబున వారలు వోయి
భవద్విజయ ఘోషంబాచరించి. విరా.
3 237.
3. చెప్పుకొనుట.
చం. ... అర్జును బోలఁగ ... ...
లేకను జనఘోష ముచ్చ...
... మహీవలయా... ... ఆది.
6 85
4. గోవులుండు ప్రదేశము, గోశాల,
తొట్టిపట్టు.
వ. విభాండకుండు ... ...
నకు వచ్చి గోగణ సంకీర్ణంబైన యొక
ఘోషంబునందు గోప సత్కృతుండై
యొక్క దివసంబు వసియించి యిది
యొక ఘోషంబని గోపాలుర నడిగిన.
అర. 3.116. (చూ. 117, 118,)
5. ఆలమంద.
(చూ. ఘోషయాత్ర).

**ఘోషయాత్ర** సం. వి. ఆ. స్త్రీ.
ఆలమందలను పరికించి వచ్చుటకై
చేయు ప్రయాణము.
ద్వైత వనమునందున్న పాండవుల
నవమానింపఁ దలఁచి కౌరవులు ఘోష
యాత్ర సలిపిరి. (చూ. దుర్యోధ
నుఁడు) అర. 5.373.

**ఘోషించు** సం. స. క్రి.
చాటించు, ప్రకటించు.
వ. ... నీ విజయంబు పురంబున
ఘోషింప గోపాలురం బుచ్చుమనిన.
విరా. 5.231.

**ఘోషిణి** సం. వి. ఈ. స్త్రీ.
శబ్ద సహితమైన వాక్కు.
సీ. ఘోషిణి నాఁగ నఘోషిణి యన
రెండు దెఱఁగుల గని వాగ్దేవి
పరఁగు. అశ్వ. 2 27.

## ఘ్న

**ఘ్న** విణ. (మూఁడు లింగముల సమా
సాంతమున నుండి).
చంపు - అను నర్థమిచ్చును ప్రత్యేక
ప్రయోగము లేదు.
నాశనము చేయు.
శత్రుఘ్నుఁడు. అర. 6 269.

## ఘ్రా

**ఘ్రాణము** సం. వి. అ. న.
మూర్కొనుట, వాసన చూచుట.
వ. ... అతండెత్తి యాలింగనంబును
మూర్ధఘ్రాణంబును జేసె. కర్ణ.3.386
2. జ్ఞానేంద్రియములలో నొకటి.
వ. త్వక్చక్షు శ్రోత్ర జిహ్వా ఘ్రాణం
బులను బుద్ధీంద్రియములును. శాంతి.
2.285.
3. ముక్కు.
సీ. గంధంబు ఘ్రాణంబు కాని తక్కిన
యాలు నధిగమింపఁగ నోపవు.
అశ్వ. 2.29.

**ఘ్రాత** సం. విణ. (బు. స్త్రీ. బు,)
ఆఘ్రాణించు వాఁడు, వాసన చూచు
వాఁడు. అశ్వ. 2.13.

**ఘ్రేయము** సం. విణ. (అ. ఆ. అ.)
మూర్కొనఁదగినది, వాసన చూడఁ
దగినది. అశ్వ. 2.13.